


# ఎవరు ధర్మాత్ములు ? ఎవరు దుర్మార్గులు ?



# మహాభారతం

## ఎవరు ధర్మాత్ములు? ఎవరు దుర్మార్గులు? 15

[illegible]

(గత సంచిక తరువాయి)

కురుసామ్రాజ్యంపై ధర్మబద్ధమైన, న్యాయసమ్మతమైన హక్కు, అధికారం కౌరవులదా? లేక పాండవులదా? అనే విషయంలో మహాభారత గ్రంథం ఏమి చెబుతున్నదో ఇంతవరకు విపులంగా, వివరంగా తెలియజేయటం జరిగింది. అంతేగాక ఈ విషయంలో కౌరవపక్షం వహించి వాదించిన పండితులయొక్క విమర్శలనన్నింటిని గ్రంథం ఆధారంగా చూపి త్రోసి వేయటం జరిగింది. పట్టాభిషిక్తుడైన రాజు పాండురాజే నని, ధృతరాష్ట్రుడెన్నడూ పట్టాభిషిక్తుడు కాలేదని స్పష్టం చేయుట జరిగింది. అంతేగాక పట్టాభిషిక్తుడైన పాండురాజ పుత్రుడు యుధిష్ఠిరుడే సర్వజ్యేష్ఠుడు గనుక; రాజ్యానికి ఉత్తరాధికారి గనుక; ధృతరాష్ట్రుడే ఆ యుధిష్ఠిరుని యౌవరాజ్యాభిషిక్తుని చేయటం జరిగిందని కనుక ధర్మరాజుకే కురుసామ్రాజ్యంపై సంపూర్ణమైన హక్కు గలదని ఋజువు చేయటమైనది. గాంధారీ గర్భతాడనం వల్ల కూడా ధర్మరాజే రాజ్యాధిపతి యని ఋజువు చేయటం జరిగింది.

**ఇక కురుపాండవులలో ధర్మాత్ములెవరో దుర్మార్గులెవరో విచారణ చేద్దాం.**

**(1)** మహాభారత గాథలో పాండవులు ధర్మాత్ములని, కౌరవులు అధర్మపరులని పండితపామరులంతా ఘంటా పథంగా చెబుతున్నప్పటికీ, కొందరు పండితులు మాత్రం కౌరవులు ధర్మాత్ములని పాండవులే అధర్మపరులని చెబుతుంటారు గదా! ఇందులో ఏది సత్యం? గ్రంథం ఏమి చెబుతున్నది?

**జ:** మహాభారత గ్రంథాన్ని జాగ్రత్తగా, సంపూర్ణంగా అధ్యయనం చేసి, అవగాహన చేసుకున్నవారు "పాండవులు ధర్మాత్ములనీ; కౌరవులు అధర్మపరులనీ" అంగీకరించక తప్పదు. అయితే వ్యతిరేకించటమే తమ ధ్యేయంగా పెట్టుకున్నవారు గాని, గ్రంథంపై పూర్తి అవగాహన లేనివారుగాని, సినిమాలు, హరికథలు, బుర్రకథలు మొదలైనవాటి జ్ఞానంతో మాత్రమే ఉండి గ్రంథాన్ని చూడనివారుగాని, లేక ఎవరు ఏది చెబితే అదే నిజమని నమ్మి ఇతరులకు చెప్పేవారు గాని కౌరవులే ధర్మాత్ములని, పాండవులు దురాత్ములని చెబుతూ ఉంటారు. వారిలో మరికొందరు అంత అన్యాయంగా మాట్లాడలేక కౌరవులు ధర్మాత్ములు కాకపోయినా మరీ అంత దుర్మార్గులేమీ కాదని; పాండవుల చర్యలకు ప్రతీకారంగానో, లేక రాజ్యంపై ఆశతోనో ఏవో కొన్ని అకార్యాలు చేసి ఉండవచ్చునని సమర్థించే ప్రయత్నం చేస్తూ ఉంటారు. అయితే మన అభిప్రాయాలు ఎలా ఉన్నప్పటికీ మహాభారత గ్రంథాన్ని మనకు అందించిన వేదవ్యాసుల వారి అభిప్రాయం ఏమిటో అది తెలుసుకోవటమే చాలా ముఖ్యం.

ఎందుకంటే మనం ఎన్ని రకాల విమర్శలు చేసినా వ్యాసులవారి మహాభారత గ్రంథం ఆధారంగానే గదా! వ్యాసుల వారు అందించిన మహాభారతం గాక మరొక మహాభారత గ్రంథాన్ని విశ్వవాఙ్మయంలో మరొకరెవరూ మనకు ప్రసాదించ లేదు గదా! పైగా వ్యాసుడు ఆ మహాభారత గాథలో ప్రత్యక్షంగా ఉన్నవాడు, ధృతరాష్ట్ర, పాండురాజ, విదురుల జన్మకు కారణమైనవాడు, ధృతరాష్ట్ర పాండురాజు లిరువురిపై ఎంతో వాత్సల్యం కలవాడు, కౌరవ పాండవుల శ్రేయస్సును కోరిన వాడు, అందరి మనస్తత్వాలు చక్కగా తెలిసినవాడు. కనుక ఆయన కన్నా ధర్మనిర్ణయం చేయగలవారెవరుంటారు? మనం ఎవరం ఎన్ని విమర్శలు చేసినా, అభిప్రాయాలు తెలిపినా వ్యాసవిరచిత మహాభారతగ్రంథాన్ని బట్టేగాని మనకెవ్వరకూ ఆ కురుపాండవులతోగాని, ఆనాటివారెవ్వరితో గాని సంబంధ బాంధవ్యాలుగాని, పరిచయం గాని లేదు గదా! కనుక మహాభారత గ్రంథాన్ని మనకందించిన వ్యాసమహర్షి అభిప్రాయమే ముఖ్యం. ఆయన ప్రసాదించిన గ్రంథంలోని పాత్రల స్వభావం ఏమిటో ఆయనకన్నా సరిగ్గా మరొకరు ఎవరు చెప్పగలరు?

మరి ఆయన ఏమి చెప్పాడు?

మహాభారతంలోని మొదటిపర్వమైన ఆదిపర్వంలో మొట్ట మొదటి అధ్యాయం అనుక్రమణికాధ్యాయం. ఈ అనుక్రమణి కాధ్యాయంలోని 110, 111 శ్లోకాల ద్వారా మహాభారత గ్రంథ తాత్పర్యాన్ని; కౌరవపాండవుల స్వభావాన్ని వ్యాస మహర్షి ఎంతో చక్కగా, స్పష్టంగా, సందేహానికి తావు లేకుండా తెలియజేయటం జరిగింది. అవేమిటో చూద్దాం.

**శ్లో॥ దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః**
**స్కంధఃకర్ణఃశకునిస్తస్య శాఖాః ।**
**దుశ్శాసనః పుష్పఫలే సమృద్ధే**
**మూలం రాజాధృతరాష్ట్రోఽమనీషీ ॥ (ఆది -1.110శ్లో)**

తా॥ దుర్యోధనుడు క్రోధమయమైన మహావృక్షము. దాని యొక్క స్కంధము (మాను) కర్ణుడు. శకుని ఆ వృక్షము యొక్క శాఖ (కొమ్మ). దుశ్శాసనాదులు సమృద్ధమైన ఫలపుష్పాలు. ఇక దానియొక్క మూలం (వేరు) అవివేకియైన ధృతరాష్ట్ర మహారాజు.

**శ్లో॥ యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః**
**స్కంధోఽర్జునో భీమసేనోఽస్యశాఖాః**
**మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే**
**మూలం కృష్ణో బ్రహ్మచ బ్రాహ్మణాశ్చ॥ (ఆది-1అ.111శ్లో)**

తా॥ యుధిష్ఠిరుడు ధర్మమయమైన మహావృక్షం. దాని యొక్క స్కంధము (మాను) అర్జునుడు. భీమసేనుడు ఆ వృక్షము యొక్క శాఖ (కొమ్మ). మాద్రీసుతులు నకుల సహదేవులు సమృద్ధమైన ఫలపుష్పాలు. ఇక దాని యొక్క మూలం (వేరు) శ్రీకృష్ణుడు, వేదములు, బ్రాహ్మణులు.

ఇదీ గ్రంథ ప్రారంభంలోనే అనుక్రమణి కాధ్యాయంలో వ్యాస భగవానుడు తన గ్రంథంలోని ప్రధాన పాత్రల స్వభావాన్ని తెలియజేసిన తీరు.

**వ్యాసమహర్షి ప్రత్యేకంగా ఎందుకిలా తెలియజేశారు?**

మహాభారతం మానవజీవిత మహేతిహాసం. ఇందులోని పాత్రలన్నీ సజీవమైనవి. ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైనా, ఏ ప్రాంతంలోనైనా ఎక్కడ చూచినా కనిపించేవే.

పరులసొమ్ముకు ఆశపడే స్వభావంతో బిడ్డలపై అతి ప్రేమను మమకారాన్ని చూపి వారి నాశనానికి కారకులయ్యే ధృతరాష్ట్రులూ మనకు కనిపిస్తుంటారు. అసూయ, పగ, ద్వేషం, ప్రతీకారం, దురభిమానంతో రగిలిపోయే దుర్యోధనులూ కనిపిస్తారు. చేసిన మేలుకు ప్రతిగా విశ్వాసంతో ఉంటున్నాను కుంటూ– అధర్మమార్గంలో నడిచే యజమానులను ఇంకా ఇంకా అన్యాయాలకు, అక్రమాలకు ప్రోత్సహిస్తూ; తెలిసీ వారి పతనానికి కారకులేలయ్యే కర్ణులూ ఉంటారు. విన్నా వినక పోయినా యజమానికి శ్రేయస్సునే చెప్పాలనే స్వభావం గల విదురసంజయులూ అక్కడక్కడ కనిపిస్తూనే ఉంటారు. ధర్మం కోసం, పెద్దలను గౌరవించటం కోసం ఎన్ని కష్టనష్టాలనైనా ఓర్చుకునే ధర్మరాజులూ అరుదుగా కనిపిస్తూనే ఉంటారు. అన్నగారి మాటలకు విలువనిచ్చి గౌరవించే భీమార్జునులవంటి సోదరులు ఉంటారు. అక్క గారి ఇంటజేరి కుటుంబాలను సర్వనాశనం చేసే శకుని లాంటి వారూ తారస పడుతుంటారు. ఇలా పరిశీలిస్తే మహాభారతంలోని పాత్రలన్నీ సజీవంగా మన కళ్ళ ఎదుట దర్శనమిస్తాయి.

అంతేకాదు ప్రతి చెడ్డవానిలోనూ కొన్ని మంచి గుణాలు, ప్రతి మంచివానిలోను కొన్ని చెడ్డగుణాలు-దోషాలు సహజం. వాటిని కూడా చక్కగా వ్యాసమహర్షి మహాభారత గ్రంథంలో అందించారు. దుష్టచతుష్టయంగా పేరుగాంచిన దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణులలోని మంచి గుణాలను దాచలేదు వ్యాసుడు. యుద్ధరంగంలో వెనుదిరిగి పారిపోని ధైర్యశాలి **దుర్యోధనుడు.** అన్నపై అత్యంత భక్తి గలిగి, అతడికోసం ఏమి చెయ్యటానికైనా వెనుదీయనివాడు **దుశ్శాసనుడు.** ఘోష యాత్రలో జరిగిన పరాభవాన్ని సహించలేక ప్రాయోపవేశానికి కూర్చున్న దుర్యోధనుని ఓదార్చటానికే ఐనప్పటికీ పాండవుల రాజ్యం పాండవులకిచ్చివేసి ఔదార్యం చూపమన్నవాడు **శకుని.** దుర్యోధనాదులతో కూడి ఉన్నప్పుడు నోటికి వచ్చినట్లు ప్రేలుతూ, పాండవులపైకి దుర్యోధనుని రెచ్చగొడుతూనే; ఏకాంతంలో భీష్మునితోనో, శ్రీకృష్ణునితోనో మాట్లాడు తున్నప్పుడు తన తప్పిదాలను, ధార్తరాష్ట్రుల దుర్మార్గాలను అంగీకరించటమే గాక పాండవుల ఆధిక్యతను అంగీకరిస్తూ ధర్మరాజుయొక్క ధర్మనిరతిని, ద్రౌపదీదేవి పాతివ్రత్యాన్ని ప్రశంసించినవాడు **కర్ణుడు.** ఇక ధర్మాత్ముడైన ధర్మనందనుని ద్యూతప్రియత్వాన్ని, భీముని ఆవేశాన్ని, అర్జునుని ఆత్మశ్లాఘ త్వాన్ని, ద్రౌపదికి అర్జునునిపై గల పక్షపాత బుద్ధిని దేనినీ దాచలేదు **వ్యాస భగవానుడు.** అందుకే అవి సజీవ పాత్రలైనవి.

అయితే దుర్మార్గులలోని కొన్ని మంచి గుణాలను మాత్రం తీసుకొని కౌరవులను ధర్మాత్ములని; అలాగే మంచివారిలోని కొన్ని దోషాలను మాత్రం గ్రహించి పాండవులను దుర్మార్గులని ఎవరూ అపోహ పడకుండా ఉండేందుకే – వ్యాసమహర్షి తన మహాభారత గ్రంథ ప్రారంభంలోనే కౌరవ పాండవుల స్వభావాలను స్పష్టంగా తెలియజేస్తూ ఈ పై రెండు శ్లోకాలను తెలియజేయటం జరిగింది. అంతేకాదు, భవిష్యత్తులో కలియుగ మానవులలో అధికులు అధర్మప్రవృత్తితో ఉంటారు గనుక; అట్టివారు తన గ్రంథంలోని పాత్రల స్వభావాలను విపరీతంగా అర్థం చేసుకొని గ్రంథ ప్రయోజనాన్ని నాశనం చేయకుండా

ఉండటానికి; మహాభారతంలోని పాత్రల స్వభావాలను వారివారి వికృత స్వభావాలకు అనుగుణంగా వ్యత్యస్తం చేసి, వక్రీకరించి, పైశాచిక ఆనందాన్ని పొందకుండా నివారించేందుకు ఇలా తన గ్రంథ తాత్పర్యాన్ని సంక్షిప్తంగా తెలియజేశారు. ఇది శాస్త్ర సాంప్రదాయం కూడా.

దీనిని బట్టి తేలినదేమంటే పాండవులు ధర్మాత్ములని, కౌరవులు దుర్మార్గులని మహాభారత గ్రంథకర్త వ్యాసుడు నిస్సందేహంగా తెలియజేశారు-అని.

**(2) పాండవులే ధర్మాత్ములని; కౌరవులు అధర్మ పరులని తెలియజేసే సాక్ష్యాలు ఇంకా ఏవైనా ఉన్నాయా?**

జ: అనేకం ఉన్నాయి. 1) దుర్యోధనాదుల తల్లి గాంధారి. గాంధారి మహాపతివ్రత, ప్రాజ్ఞురాలు, ధర్మం తెలిసిన ధర్మజ్ఞురాలు, మహాసాధ్వి, దీర్ఘదర్శి, గొప్ప వాక్శుద్ధి గలిగిన మహాఇల్లాలు. మహాభారత యుద్ధం నిశ్చయమైన తరువాత దుర్యోధనుడు తల్లిదీవెనలు తీసుకొనుటకై గాంధారి వద్దకు వచ్చి నమస్కరించగా; తల్లి గాంధారి తన పుత్రుని 'విజయోస్తు' అని దీవించలేదు. **"యతోధర్మస్తతో జయః"** ధర్మమెచ్చటనో విజయమచ్చటే- అని దీవించింది. మహాభారత యుద్ధంలో పాండవులు జయించారు. దీనినిబట్టి పాండవులే ధర్మాత్ములు అనే విషయం రూఢి అవుతుంది. పోనీ 'ఏదో గాంధారి అలా నోటికి వచ్చినట్లు దీవించింది' అనుకుందామా అంటే - గాంధారి వాక్శుద్ధి ఎలాంటిదో చూద్దాం. మహాభారత యుద్ధానంతరం యుద్ధమృతులను జూచి హృదయ విదారకంగా విలపించిన గాంధారి, "ఈ కురుకుల నాశనాన్ని ఆపగలిగీ ఉదాసీనంగా ఉన్నాడు శ్రీకృష్ణుడు" అని భావించి, కురు వంశీయుల లాగే యాదవులు కూడా 36 సంవత్సరాలకు తమలో తాము పోరాడుకొని నశిస్తారు అని శ్రీకృష్ణుని శపించింది. అదే విధంగా భారతయుద్ధానంతరం 36 సంవత్సరములకు యాదవనాశనం జరిగిపోయింది. గాంధారి శాపశక్తి అలాంటిది. అంతేకాదు యుద్ధం ముగిసిన తర్వాత ధర్మరాజు గాంధారికి నమస్కరించగా పుత్రశోకంతో క్రోధావేశ పరురాలైయున్న గాంధారి దృష్టి కన్నులకు అడ్డంగా కట్టుకున్న బట్ట సందులలో నుండి ధర్మజుని కాలివ్రేళ్ళగోళ్ళపై పడగా అవి నల్లగా మాడిపోయినవి. అది చూచి భయంతో అర్జునుడు శ్రీకృష్ణుని చాటుకు వెళ్ళి నిలబడ్డాడు. గాంధారి శక్తి అటువంటిది.

ఈ గాంధారియే పుత్రశోకంతో వివశయై పాండవులను శపించతలపెట్టగా వ్యాసమహర్షి ప్రత్యక్షమై నీ పుత్రుడు ఆశీర్వాదానికి వచ్చినపుడు 'యతోధర్మస్తతోజయః' అని దీవించావు. నీవు అసత్యం పలుకలేదు, ధర్మమే జయించింది. ధర్మబలం వల్లనే పాండవులు జయించారు. నీవు అధర్మాన్ని విడిచిపెట్టు అన్నప్పుడు గాంధారి-

**శ్లో॥ భగవాన్నాభ్యసూయామి నైతానిచ్ఛామి నశ్యతః।**
**పుత్రశోకేనతుబలాత్ మనోవిహ్వలతీవమే॥ (స్త్రీ-14అ.14శ్లో)**

**తా॥** మహాత్మా! పాండవుల పట్ల నాకు శత్రుభావం లేదు. వారి నాశనాన్ని నేను కోరటం లేదు. కాని ఏం చేయను? పుత్రశోకంతో నా మనస్సు హఠాత్తుగా వ్యాకులపడి పోతున్నది.

**శ్లో॥ దుర్యోధనాపరాధేన శకునేః సౌబలస్యచ।**
**కర్ణదుశ్శాసనాభ్యాంచ కృతోఽయం కురుసంక్షయః॥ (స్త్రీ 14అ.16శ్లో)**

**తా॥** దుర్యోధనుడు, నా సోదరుడు శకుని, కర్ణుడు, దుశ్శాసనుడు- ఈ నలుగురి అపరాధం వల్లనే ఈ కురుకుల నాశనం జరిగింది.

**శ్లో॥ నాపరాధ్యతి భీభత్సుః నచపార్థోవృకోదరః।**
**నకులఃసహదేవశ్చ నైవజాతు యుధిష్ఠిరః॥ (స్త్రీ14అ.17శ్లో)**

**తా॥** ఇందులో అర్జునుని యొక్క అపరాధం గాని, భీమసేనుని అపరాధం గాని, నకులసహదేవులయొక్క మరియు యుధిష్ఠిరుని యొక్క అపరాధం గాని, దోషంగాని ఏమీ లేదు.

**గాంధారి స్వయంగా అందునా తన నూరుగురు పుత్రుల మృతదేహాల వద్ద పుత్రశోకంతో విహ్వలయై ఉన్న సమయం లోనే ఈ కురుకుల నాశనానికి దుర్యోధన, దుశ్శాసన, శకుని కర్ణులే కారణమని; పాండవుల అపరాధం ఏమీలేదని చెప్పటం వల్ల ధర్మాత్ములెవరో దుర్మార్గులెవరో తేలిపోయింది.**

ఇక మరొక సాక్ష్యం (ii) కర్ణుడు

తన రాయబారం విఫలమైన తరువాత శ్రీకృష్ణుడు హస్తినాపురం నుండి ఉపప్లావ్యం వెళుతూ, పొలిమేర దాటగానే తనవెంట వచ్చిన వారినందరినీ వెనుకకు పంపి కర్ణుని తన రథంపై కెక్కించుకుని అతడితో, "కర్ణా! నీవు కుంతీపుత్రుడవు. ధర్మజుని అన్నవు. న్యాయంగా ఈ రాజ్యం నీకే రావాలి. కనుక నీవు పాండవపక్షం వైపుకురా! నిన్నే రాజ్య పట్టాభిషిక్తుని చేయటం జరుగుతుంది" అని చెప్పగా, కర్ణుడు తన కారణాలు తాను చెప్పి, "నాకు రాజ్యం వస్తే నేను దానిని దుర్యోధనునికే ఇవ్వాలి" కాని-

**శ్లో॥ సఏవరాజా ధర్మాత్మా శాశ్వతోఽస్తు యుధిష్ఠిరః।**
**నేతాయస్య హృషీకేశో యోద్ధాయస్య ధనంజయః**
**(ఉద్యో. 141 అ.23శ్లో)**

**తా॥** "ఎవరికి హృషీకేశుడు నాయకుడో, యోధుడు అర్జునుడో, అట్టి ధర్మాత్ముడైన యుధిష్ఠిరుడే శాశ్వతంగా రాజుగా ఉండాలని నేను కోరుకుంటున్నాను" అన్నాడు కర్ణుడు.

అంతకాదు జరుగబోయే యుద్ధంలో తాము వధించబడ తామని, పాండవులు జయిస్తారని తెలియజేయటమే గాక-

**శ్లో॥ నిమిత్తం తత్రశకుని రహం దుశ్శాసన స్తథా।**
**దుర్యోధనశ్చనృపతిః ధృతరాష్ట్ర సుతోఽభవత్॥**
**(ఉద్యో. 143 అ.3శ్లో)**

తా॥ ఈ జరుగబోయే వినాశనానికి శకుని, నేను, దుశ్శాసనుడు, ధృతరాష్ట్రపుత్రుడు దుర్యోధనుడు కారణం అవుతున్నాము అని కూడా తెలియజేశాడు.

దుష్టచతుష్టయంలోని కర్ణుడు; దుర్యోధనునికోసం ఏమైనా చేస్తాననే కర్ణుడు; మహాభారత యుద్ధానికి దుర్యోధనుని ప్రోత్సహించిన కర్ణుడు; పాండవులకు ఎంతటి అన్యాయాన్నైనా చేయటానికి వెనుదీయని కర్ణుడు; పాండవులపైకి దుర్యోధనుని రెచ్చగొట్టిన కర్ణుడు; ద్యూతసభలో ద్రౌపదిని నీచాతినీచంగా మాట్లాడిన కర్ణుడు; ద్రౌపదియొక్క పాండవులయొక్క వస్త్రాలను హరించమని దుశ్శాసనుని ఆదేశించిన కర్ణుడు ఏకాంతంలో శ్రీకృష్ణుని సమక్షంలో, "ధర్మాత్ముడైన ధర్మరాజే శాశ్వతంగా రాజుగా ఉండాలని, దుర్యోధనునికి రాజ్యం రావటం ఇష్టం లేదని చెప్పటమే గాక ఈ జరుగబోయే మహావినాశనానికి నేనూ, శకుని, దుశ్శాసనుడు, దుర్యోధనుడే కారణమని తెలియజేయటంతో ధర్మాత్ములెవరో, దుర్మార్గులెవరో తేలిపోతున్నది.

(3) మరొక సాక్ష్యం ధర్మరాజు- దుర్యోధనులు స్వయంగా పలికిన పలుకులు.

పాండవుల అరణ్యవాసం ముగింపులో యక్షప్రశ్నలకు ధర్మరాజు సమాధానమివ్వగా సంతోషించిన యక్షుడు (ధర్మదేవత), "నీ సోదరులలో ఒకరిని బ్రతికిస్తాను. ఎవరు కావాలో చెప్పు"మనగా ధర్మరాజు, నకులుని బ్రతికించమని కోరాడు. దానికి ఆశ్చర్యపోయిన ధర్మదేవత "బలపరాక్రమాలు గల భీమార్జునులను కోరక నకులుని ఎందుకు కోరుకున్నావని" అడుగగా, ధర్మరాజు-

**శ్లో॥ ధర్మఏవహతోహంతి ధర్మోరక్షతి రక్షితః**
**తస్మాత్ ధర్మంనత్యజామి మానో ధర్మోహతోऽవధీత్॥**
**(అరణ్య 313 అ. 128 శ్లో)**

తా॥ ధర్మాన్ని నాశనం చేస్తే అది మనను నాశనం చేస్తుంది. ధర్మాన్ని రక్షిస్తే అది మనను రక్షిస్తుంది. అందువల్ల నేను ధర్మాన్ని విడిచిపెట్టను. ఎంత కష్టం, నష్టం కలిగినా ఆ ధర్మమే నన్ను కాపాడుతుంది-అని.

స్వయంగా ధర్మరాజు ధర్మాన్ని నేను విడిచిపెట్టను. అధర్మం వైపుకు వెళ్ళను అని చెబుతుండగా మరి దుర్యోధను డేమంటున్నాడు?

దుర్యోధనుడు స్వయంగా తన ప్రవృత్తిని-స్వభావాన్ని తెలియజేస్తూ-

**శ్లో॥ జానామిధర్మం నచమే ప్రవృత్తిః**
**జానామ్యధర్మం నచమే నివృత్తిః ॥** అన్నాడు.

తా॥ ధర్మమేమిటో నాకు తెలుసు. కాని నా మనస్సు అటు వెళ్ళదు. అధర్మమేమిటో నాకు తెలుసు. కాని నా మనస్సు దానినుండి మళ్ళదు-అని, స్వయంగా దుర్యోధనుడే **'నా మనస్సు అధర్మం నుండి మళ్ళదు, ధర్మం వైపుకు తిరగదు'** అని చెప్పినా పాపం ఈ కౌరవాభిమానులు మాత్రం ఆ కౌరవులపై ఈగ వ్రాలనీయక పాండవులను దూషించి పైశాచికానందాన్ని పొందుతుంటారు.

ఇంకా కౌరవపక్షంలోని పెద్దలు-విదుర, భీష్మ, ద్రోణ, కృప, సంజయులు అనేక సందర్భాలలో పాండవులు ధర్మాత్ములని, వారికి అన్యాయం చేయవద్దని అనేక విధాలుగా ధృతరాష్ట్రునికి తెలియజెప్పి దుర్యోధనాదులు చేసే అక్రమాలను, అన్యాయాలను ఏకరువు పెడుతూనే ఉన్నారు. అలాగే ధృతరాష్ట్రుడు కూడా పాండవులు ధర్మాత్ములేనని అంగీకరిస్తాడు. కాకపోతే రాజ్యకాంక్ష -పుత్రప్రేమ.

**(iv) ఇక చివరిగా మహాభారత గ్రంథకర్త వ్యాసుడు.**

మహాభారత యుద్ధం ప్రారంభంకాబోతున్నదనగా ఆ ముందు రోజు రాత్రి వ్యాసభగవానుడు ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి "కాలమహిమవల్ల నీ పుత్రులు, ఇతర రాజులు తమలో తాము పోరాడుకుంటూ, చంపుటకు, చనిపోవుటకు సిద్ధమయ్యారు. ఈ యుద్ధదృశ్యాన్ని చూడాలనుకుంటే నీకు దివ్య దృష్టిని ప్రసాదిస్తాను" అనగా ధృతరాష్ట్రుడు, "మహాత్మా! నా వారి మరణాన్ని నేను చూడలేను. యుద్ధ విశేషాలను నీ అనుగ్రహంతో వినాలనుకుంటున్నాను" అన్నాడు. అంతట వ్యాసుడు సంజయునకు దివ్యదృష్టిని ప్రసాదించి "యుద్ధ విశేషాలను వినిపించ"మని ఆదేశించాడు. యుద్ధం వల్ల జరగబోయే ఘోర నాశనాన్ని వివరిస్తూ వ్యాసుడు-

**శ్లో॥ దిష్టమేతన్నరవ్యాఘ్ర నాభిశోచితు మర్హసి**
**నచైవశక్యం సంయంతుం యతోధర్మస్తతో జయః**
**(భీష్మప. 2 అ. 14 శ్లో)**

తా॥ మహారాజా! ఇది దైవసంకల్పం. విధిని ఎవరూ తప్పించలేరు. అందువల్ల దీని కొరకు నీవు శోకించతగదు. ఎక్కడ ధర్మమున్నదో ఆ పక్షానికే విజయం తథ్యం-అన్నాడు. ఈ వ్యాస వాక్యాన్ని బట్టి కూడా పాండవులదే ధర్మపక్షమని, కౌరవులది అధర్మ పక్షమని ఋజువౌతున్నది.

ఇంతవరకు కౌరవపక్షం వారైన గాంధారి, కర్ణుడు, దుర్యోధనుడు, భీష్మాదులు, గ్రంథకర్త వ్యాసమహర్షి మొదలగు వారు వెలిబుచ్చిన అభిప్రాయాల ప్రకారం ధర్మాత్ములెవరో-దుర్మార్గులెవరో సాక్ష్యాధారాలతో నిరూపించటం జరిగింది.

ఇక కౌరవ పక్షాభిమానులైన విమర్శకులకు దొరికిన మరొక ఆయుధం 'వేమన' "పేరు ధర్మరాజు పెదవేప విత్తయా విశ్వదాభిరామ వినురవేమా" అని వేమన మహాకవి ధర్మరాజును వేపవిత్తులాంటివాడని తప్పుబట్టారు కదా! దీనికేమంటారు? అని వీరి ఆనందం. మరి ఇందులోని విశేషం ఏమిటి?

**(వచ్చే సంచికలో)**



# మహాభారతం

## ఎవరు ధర్మాత్ములు? ఎవరు దుర్మార్గులు? 16

రచన
మహాభారత పరిశోధకులు,
ఫోన్: 08647-254716

(గత సంచిక తరువాయి)

కురుపాండవులలో ధర్మాత్ములెవరు? దుర్మార్గులెవరు? అనే విషయంపై మహాభారత గ్రంథకర్త వ్యాసమహర్షి ఇరు పక్షాలకు క్రోధమయ మహావృక్షము, ధర్మమయ మహావృక్షము అని పోల్చి, ఆదిపర్వం అనుక్రమణికాధ్యాయంలో చెప్పిన రెండు శ్లోకాలను తెలియజేయటం జరిగింది. ఇక సాక్షాత్తు కౌరవులతల్లియైన గాంధారియే సమస్త కౌరవనాశనానికి తన కుమారులు, సోదరుడు శకుని, కర్ణుడే కారణమని తెలియ జేయుటయేగాక పాండవుల అపరాధమేమీలేదని తెలియ జేసింది. అలాగే దుష్టచతుష్టయంలోని కర్ణుడు శ్రీకృష్ణుని సమక్షంలోనే 'జరుగబోయే వినాశనానికి నేనూ, దుర్యోధనుడు, దుశ్శాసనుడు, శకునియే కారణమని, 'ధర్మరాజు ధర్మాత్ముడని' తెలియజేయటం గురించి వివరించటం జరిగింది. ఇక స్వయంగా దుర్యోధనుడే ధర్మమార్గం వైపు తన మనస్సు పోదని, అధర్మం నుండి మరలదని-తన స్వభావాన్ని తానే చెప్పిన విషయాన్నీ తెలియజేయటం జరిగింది. భీష్మ, ద్రోణ, కృప, విదుర, సంజయాదులు అనేక సందర్భాలలో పాండవులు ధర్మాత్ములని, కౌరవులు అధర్మపరులని చెప్పినట్లు తెలియజేసి, ధర్మాత్ములెవరో దుర్మార్గులెవరో నిరూపించటం జరిగింది.

ఇక కౌరవ పక్షాభిమానులు మహాకవి వేమనగారి పద్యాన్ని ఒకదాన్ని పట్టుకొని పాండవులను-అందునా ధర్మరాజును అధర్మపరునిగా చిత్రించటానికి ప్రయత్నించారు. "పేరు ధర్మరాజు పెదవేపవిత్తయా" అని ధర్మరాజును వేమన కవి నిరశించారు గదా! అని ఈ విషయంలో విమర్శకుల విమర్శ దానికి సమాధానం చూద్దాం.

**(3)** వేమనలాంటి మహాకవి, పరమవైరాగ్యమూర్తి **"పేరు ధర్మరాజు పెదవేపవిత్తయా విశ్వదాభిరామ వినురవేమా"** అని తన శతక పద్యంలో ధర్మరాజు వేపవిత్తులాంటి వాడు అని పేర్కొన్నారు గదా! మరి వేమనగారికి మహాభారతం సరిగ్గా తెలియదా? లేక తెలిసినా వ్యాసులవారి అభిప్రాయాన్ని అర్థం చేసుకోలేకపోయాడా? లేక ఏదో ఆషామాషీగా అలా వ్రాశాడా? ఇవన్నీ గాక ఆ పద్యం ఆయన వ్రాయలేదు-ప్రక్షిప్తం అంటారా?

**జ:** వేమనకవికి మహాభారతం తెలియదనటం గాని, వ్యాసులవారి అభిప్రాయాలను సరిగ్గా అర్థం చేసుకోలేక పోయాడు అని అనటం గాని 'మంచుకు చల్లదనం లేదు' అనటం వంటిదే. అంతేకాదు ఆయన ఏదో ఆషామాషీగా పద్యాలను వ్రాసేకవి అని ఎవ్వరూ అనరు. ఇక కౌరవపక్షాభి మానుల లాగా-ఎలాగోఒకలాగ తమ వాదనను నెగ్గించు కొనేందుకు తమకు అనుకూలంగా ఉన్న విషయాలను సత్యమని, తమకు వ్యతిరేకంగా ఉన్న విషయాలను ప్రక్షిప్తమనీ- వితండవాదం చేయవలసిన అవసరం అసలేలేదు. మరెందుకలా వ్రాశారు?

అసలు విషయం ఏమంటే 'పేరు ధర్మరాజు పెద వేప విత్తయా' అని వ్రాసిన పద్యపాదం యొక్క అసలైన అర్థాన్ని- ఆ పాదాన్ని వ్రాయటంలో వేమనగారి అభిప్రాయాన్ని సరిగ్గా తెలుసుకోలేకపోవటమే ఈ కౌరవ పక్షాభిమానుల అసమర్థత అజ్ఞానం.

**'పేరు ధర్మరాజు పెదవేపవిత్తయా'** అనే ఈ పద్యపాదం లోని ధర్మరాజు మహాభారతంలోని పాండవ జ్యేష్ఠుడైన ధర్మరాజేననుకొని పప్పులో కాలేశారు ఈ విమర్శకులు. లోకంలో చాలామంది తమ బిడ్డలకు శ్రీరాముణ్ణి ఆదర్శంగా తీసుకొని రామారావు అని, శ్రీకృష్ణునిపై భక్తితో కృష్ణారావు అని, తమపిల్లవాడు ఎప్పుడూ సత్యమే పలకాలని హరిశ్చంద్ర రావు అని, అలాగే ధర్మం తప్పకుండా నడచిన ధర్మరాజులా ఉండాలని ధర్మరాజని, ఇంకా ఆడపిల్లలైతే లక్ష్మిఅని, సరస్వతి అని, పార్వతి అని-ఇలా పేర్లు పెట్టుకుంటూ ఉంటారు. అయితే పేరు పెట్టినంత మాత్రాన అలా ఆదర్శంగా ఉంటారనే

నమ్మకం లేదు. హరిశ్చంద్రరావు అని పేరు గలవాడు చచ్చినా నిజం చెప్పకపోవచ్చు. ధర్మరాజు అని పేరున్నంత మాత్రన అధర్మపరుడు కాడనే న్మకం లేదు. అలాంటి లోకసహజమైన విషయాన్ని సూటిగా పాఠకులకు తెలియజేయటం కోసమే వేమన మహాకవి పేరు మాత్రం ధర్మరాజు; కాని ఆచరణ మాత్రం ధర్మరాజులా లేదు, వేపవిత్తులాంటివాడు అని తెలియజేయటానికే "పేరు ధర్మరాజు పెదవేపవిత్తయా" అని వ్రాయటం జరిగింది. అలా గనుక కాకపోతే 'పేరు ధర్మరాజు' అని అనాల్సిన అవసరమేముంది?

ఏదో 'మసిబూసి మారేడుకాయ చేయటానికి' ఇలా అంటున్నారు గాని, వేమన గారికి ధర్మరాజుపై చెడు అభిప్రాయమే ఉండి ఉండవచ్చునంటారా-అయితే వేమనగారి మరొకపద్యం చూడండి.

**ధర్మమరసిపూని ధర్మరాజాదులు**
**నిర్మలంపుకీర్తి నిలుపుకొనిరి।**
**ధర్మమే నృపులకు తారకయోగంబు**
**విశ్వదాభిరామ వినురవేమా॥**

తా॥ ధర్మాన్ని తెలుసుకొని, ధర్మాన్ని ఆచరించి, ధర్మరాజు మొదలగువారు నిర్మలమైన కీర్తిని నిలుపుకున్నారు. ధర్మమే రాజులకు తరించేందుకు చక్కని మార్గం-అని. ఇక్కడ వేమన కవి ధర్మరాజును ధర్మం తెలిసినవాడని, ఆచరించినవాడని, కీర్తిని నిలుపుకొన్నవాడని ప్రశంసించాడు. అంతేకాదు రాజులకు ధర్మమే తరుణోపాయం అన్నాడు. ఇక్కడ ధర్మరాజు రాజేగాని సామాన్యుడు కాదు. ఇక్కడ చెప్పిన ధర్మరాజు పాండవజ్యేష్ఠుడైన ధర్మరాజేననుటలో ఏ సందేహం లేదు.

**ఏ ధర్మరాజును ధర్మాత్ముడని వేమన కవి ప్రశంసించాడో అదే ధర్మరాజును 'వేపవిత్తు' అని నిరసిస్తాడా? ఇప్పటి ఈ విమర్శకులలాగా స్వవచన వ్యాఘాతానికి పాల్పడతాడా? ఒకచోట ధర్మాత్ముడని ప్రశంసించి, మరొకచోట దురాత్ముడని పలికే అల్పుడా వేమన కవి? ఏ లాభం కోసం- ఏ స్వార్థం కోసం - ఏ పేరు ప్రతిష్ఠలకోసం అలా అడ్డదిడ్డంగా మాట్లాడు తాడు పరమవైరాగ్యమూర్తియైన వేమనమహాకవి?**

వేమనకవికి ధర్మరాజును గూర్చే కాదు, దుర్యోధనుని గూర్చి కూడా బాగా తెలుసు. మహాభారతమే కాదు, రామాయణాది గ్రంథాలు కూడా బాగా తెలుసు. ధర్మరాజును ధర్మాత్ముడని పై పద్యంలో ప్రశంసించిన కవి దుర్యోధనుని గురించి ఏమన్నాడో చూడండి.

**రాముడొకడు పుట్టి రవికుల మీడేర్చె**
**కురుపతి జనియించి కులము జెరిచె**
**నిలను పాపపుణ్యమీలాగుగాదొకో**
**విశ్వదాభిరామ వినురవేమా॥**

**తా॥** శ్రీరాముడు పుట్టి సూర్యవంశాన్ని ఉద్ధరిస్తే, కురుపతి దుర్యోధనుడు జన్మించి కురువంశాన్ని నాశనం చేశాడు-అని

దుర్యోధనునిపై వేమనకవి అభిప్రాయం ఎలాంటిదో కౌరవపక్షాభిమానులు గ్రహించి కళ్ళు తెరుచుకోవాలి. కుల నాశనకారుడౌతాడని తెలిసి కూడా దుర్యోధనుని సమర్థించిన ధృతరాష్ట్రునికి ఏ గతి పట్టిందో గమనించాలి. తాను పుట్టు గ్రుడ్డి. గాంధారి కట్టు గ్రుడ్డి. వందమంది కుమారులు. కాని ఒక్కడు కూడా మిగల్లేదు. ఏ పాండవులకు ద్రోహం తలపెట్టాడో ఆ పాండవుల పంచన భార్యాభర్తలిరువురు 13 సంవత్సరములు గడిపారు. ఏ కుంతీదేవిని లక్కఇంట మట్టు బెట్టాలని చూచాడో ఆ కుంతీదేవి యొక్క సేవలను 3 సంవత్సరాల పాటు అరణ్యాలలోని ఆశ్రమాలలో నివసిస్తూ పొందాడు. చేసినపాపం ఎక్కడకూ పోదు. కట్టి కుడుపుతుంది .అని గ్రహించి, మహాత్ములదూషణను, మహాపతివ్రతల దూషణను మహాగ్రంథాల దూషణను మానుకోవాలి. తేలినదేమంటే-

వేమనకవి అభిప్రాయం ప్రకారం కూడా ధర్మరాజు ధర్మాత్ముడేనని, దుర్యోధనుడు కులనాశన కారకుడని, దుర్మార్గుడని స్పష్టం అవుతున్నది. దీనినిబట్టి 'పేరు ధర్మరాజు పెదవేపవిత్తయా' అని చెప్పిన పద్యపాదంలోని ధర్మరాజు పాండ వాగ్రజుడైన ధర్మరాజు కాదని, పేరు మాత్రం ధర్మరాజు అని పెట్టుకొని అధర్మకార్యాలాచరించే సామాన్యుడని గ్రహించాలి.

**(4)** పాండవులు ధర్మాత్ములు, కౌరవులు దుర్మార్గులు-అధర్మపరులు అన్నారు కదా! కౌరవులు చేసిన అన్యాయాలు, దుర్మార్గాలు, అధర్మకార్యాలు ఏమిటి?

**జ:** కౌరవులు చేసిన అన్యాయాలకు, అక్రమాలకు అంతే లేదు.

(I) పరులసొమ్ముకు ఆశపడి, వారి సొమ్మును (రాజ్యాన్ని) కాజేయాలనుకొనే స్వభావంతో; తమచేత జిక్కిన పాండవుల రాజ్యాన్ని తిరిగి వారికి దక్కకుండా చేయాలనే దుర్బుద్ధితో; బాల్యంలోనే పాండవులను తుదముట్టించాలని అనేక ప్రణాళికలు రచించి అమలు చేశారు. జ్యేష్ఠుడై, రాజ్యానికి వారసుడై, అధికారియైన ధర్మరాజును అంతం చేయాలంటే బలవంతుడైన భీమసేనుడున్నంతవరకు సాధ్యం కాదు గనుక; ఆ భీముని చంపుటకు విషాన్నాన్ని స్వయంగా దుర్యోధనుడే తినిపించి, లతలతో బంధించి, గంగలో త్రోయించాడు.

(II) పాండవుల పరాక్రమం, గుణగణాలు గమనించిన పౌరులు ధర్మరాజుకు రాజ్యపట్టాభిషేకం చేయాలని సభల లోను, చత్వరములందును నిర్ణయిస్తూ ఉంటే; రాజ్యం తమచేతినుండి సంపూర్ణంగా జారిపోకుండా ఉండటానికై ధృత రాష్ట్రుడు కుటిలనీతితో ధర్మరాజుకు యౌవరాజ్య పట్టాభిషేకం చేసి, తాత్కాలికంగా పౌరులను, పెద్దలను చల్లబరిచి, ఆ



**వేరుకు నీరుపోస్తే వృక్షమంతా ఆనందిస్తుంది**

తరువాత కుంతీదేవితో సహా పాండవులను లక్క ఇంట దగ్ధం చేయుటకై వారిని వారణావతం వెళ్ళి అక్కడ కొన్ని నాళ్ళుండి రమ్మని పంపించాడు.

(III) దుర్యోధనుడు పురోచనుని సాయంతో లక్కఇంటిని నిర్మింపజేసి, పాండవులనందులో ప్రవేశింపజేసి, వారిని నిలువునా అగ్నికి ఆహుతి చేయతలపెట్టాడు.

(IV) పాండవులు ద్రౌపదిని వివాహమాడి పాంచాల, యాదవుల సాయంతో అరివీర భయంకరులైనారని గ్రహించి, ధృతరాష్ట్రుడు వారిని రావించి, అర్ధరాజ్యంగా ఖాండవప్రస్థాన్ని స్తున్నాను. అక్కడికి వెళ్ళి సుఖంగా ఉండండి–అని పంపించాడు. ఖాండవప్రస్థం మహాబలవంతులైన నాగులకు నివాస స్థానం. ఆ నాగులద్వారా పాండవనాశనం జరుగుతుందని అంధరాజు దురాలోచన.

(V) పాండవులు ఇంద్రప్రస్థాన్ని నిర్మించుకొని, దిగ్విజయ యాత్రలు చేసి, రాజసూయ యాగాన్ని మహావైభవంగా నిర్వర్తించగా– ఆ పాండవుల సంపదను చూచి కన్నుకుట్టిన అసూయాగ్రస్తుడైన దుర్యోధనుడు, ఎలాగైనా పాండవుల సంపదను హరించాలని నిశ్చయించి; శకునిచేత కపటజూదం ఆడించి, పాండవుల రాజ్యాన్ని సర్వసంపదలను హరించారు. అంతటితో ఆగక సభ్యసమాజం తలదించుకొనే విధంగా పెద్దలు, గురువులు, బంధుమిత్రాదులు, అనేకమంది రాజులు ఉన్న నిండుసభలోనికి పాండవపత్ని ద్రౌపదీదేవిని ఈడ్చుకుని వచ్చి, వస్త్రాపహరణం చేసి, ములుకులవంటి పలుకులతో వారి హృదయాలను గాయపరచి తీవ్రంగా పరాభవించారు.

(VI)దుశ్శకునాలకు భయపడిన ధృతరాష్ట్రుడు–ద్రౌపదీదేవిని ప్రశంసించి వరాలు కోరమని ప్రోత్సహించి జూదంలో పాండవులు కోల్పోయిన సర్వసంపదలను, రాజ్యాన్ని వారికి ఇచ్చి పంపించాడు. తిరిగి దుర్యోధనుని ప్రోద్బలంతో మార్గ మధ్యం నుండే వారిని పిలిపించి 12 ఏళ్ళు అరణ్యవాసం, ఒక యేడు అజ్ఞాతవాసం పణంగా జూదం ఆడించి–శకుని మాయచే ఓడించి పాండవులను అరణ్యాలకు పంపించారు.

(VII) అరణ్యవాసం చేస్తున్న పాండవులను అవమాన పరచాలని, వారి ఎదుట తమ ఆధిక్యతను, వైభవాన్ని ప్రదర్శించాలని నిశ్చయించి; ఘోషయాత్రానెపంతో సోదరులతోను, భార్యలతోను, శకుని, కర్ణులతోను, చతురంగ బలాలతోను పాండవులున్నచోటకు వెళ్ళారు. కాకపోతే **'చెఱపకురా చెడేవు'** అనే సామెత ప్రకారం పాండవులను పరాభవించాలని వెళ్ళి గంధర్వులచేతిలో తీవ్ర పరాభవాన్ని పొంది తిరిగి వచ్చారు.

(VIII) ద్యూత నియమం ప్రకారం అరణ్య అజ్ఞాత వాసాలు పూర్తి గావించిన పాండవులకు వారి రాజ్యాన్ని వారికివ్వ నిరాకరించి, సూదిమొన మోపినంత నేలను కూడా ఇచ్చేది లేదని యుద్ధానికి సిద్ధమయ్యారు కౌరవులు.

(IX) ఇరువురికీ బంధువైన శ్రీకృష్ణుని పాండవులు రాయబారిగా పంపగా, ఆ శ్రీకృష్ణునే బంధించ ప్రయత్నించి విఫలమయ్యారు దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు.

(X) కురుక్షేత్ర యుద్ధప్రారంభానికి ముందుగా శకుని కుమారుడు ఉలూకుని పాండవుల వద్దకు రాయబారిగా పంపించి, **'చేసిన ప్రతిజ్ఞలు నెరవేర్చుకొనేందుకు క్షత్రియ జన్మమెత్తినవారైతే పౌరుషమున్నవారైతే రమ్మని'** రెచ్చగొట్టాడు దుర్యోధనుడు.

ఇలా కౌరవుల అధర్మాలకు అంతే లేదు.

**(5)** పాండవులు ధర్మపరులని ఎలా చెప్పటం? వారి మంచితనం ఏమిటి?

**జ:** (I) భీముని చంపుటకు విషాన్నం పెట్టినా, గంగలో త్రోయించినా, పాములచే కరిపించినా పాండవులు దుర్యోధనునికి కాని, వాని సోదరులకు కాని ఏ అపకారం తలపెట్టలేదు.

(II) ధృతరాష్ట్రుడు ఎప్పుడు ఏమి చెప్పినా ఆయన మాటను జవదాటక ప్రవర్తించారు. వారణావతానికి వెళ్ళమన్నా, అర్ధరాజ్యంగా ఖాండవప్రస్థం తీసుకొని వెళ్ళమన్నా, సుహృూ ద్యూతం అని చెప్పిరమ్మన్నా, పునరుద్యూతానికి– దేనికీ వ్యతిరేకించలేదు.

(III) లక్కఇంట తగులబెట్టాలని కౌరవులు ప్రయత్నించి నప్పటికీ, తాము పాంచాలయాదవుల తోడ్పాటుతో బలవంతులైన తర్వాత కూడా వారికేమాత్రం హాని తలపెట్టలేదు పాండవులు.

(IV) జూదంలో తనను తాను ఒడ్డుకొని ఓడిన తర్వాత శకుని ప్రేరణతో ఇష్టంలేక పోయినా ద్రౌపదిని పణంగా బెట్టి జూదమాడాడు ధర్మరాజు. దీనికి కారణం–తాను జూదంలో ఓడి కౌరవులకు దాసుడయ్యాడు గనుక; దాసుడు యజమాని ఆజ్ఞను పాలించాలి గనుక; దాసుని ధర్మాన్ని అనుసరించి ధర్మరాజు ద్రౌపదిని ఒడ్డటం జరిగింది.

(V) తమను ఎంతగా పరాభవించినా, తమ కళ్ళ ఎదుటే ద్రౌపదిని వివస్త్రను జేయ ప్రయత్నించినా ధర్మానికి కట్టుబడి మౌనం వహించాడు పాండవులు.

(VI) తమను అవమానించుటకై ఘోషయాత్రా నెపంతో

వచ్చిన కౌరవులు తమ భార్యలతో సమా గంధర్వుల చేతిలో బందీలుకాగా; విషయం తెలిసిన ధర్మరాజు, భీమార్జునులను పంపి గంధర్వులను జయించి, దుర్యోధనాదులను స్త్రీలను బంధవిముక్తులను జేసి కురువంశప్రతిష్ఠను నిలబెట్టాడు.

(VII) అరణ్యాలలో ద్రౌపదిని కామదృష్టితో చూచి, బంధించి, తన రథంపై కూర్చుండబెట్టుకొని వెళుతున్న సైంధవుని భీమార్జునులు వెంబడించి, అతడిని జయించి పరాభూతుడిని చేసి, తల్లి గాంధారిని, సోదరి దుస్సలను స్మరించి ప్రాణాలతో విడిచిపెట్టారు.

(VIII) నియమానుసారం అరణ్య అజ్ఞాతవాసాలను ఎన్నో క్లేశాలనుభవించి పూర్తిగావించారు.

(IX) ఉత్తరగోగ్రహణ సమయంలో సమ్మోహనాస్త్రంతో సమస్త కౌరవసేనావాహినిని, మూర్ఛితులను జేసి కూడా అర్జునుడు దుర్యోధన, దుశ్శాసనాది సోదరులను గాని, గాంధారపతి శకునిని గాని, కర్ణుని గాని బంధించక, వధించక విడిచిపెట్టి వెళ్ళిపోయాడు.

(X) పునర్ద్యూత నియమం ప్రకారం తమకు రావలసిన రాజ్యాన్ని ఇవ్వకపోయినా కనీసం ఐదుగురికి 5 ఊళ్ళైనా ఇమ్మని, తుదకు ఒక్క ఊరైనా ఇమ్మని, యుద్ధం కారణంగా సర్వనాశనం జరగకుండా ఉండాలని, చివరివరకు ప్రయత్నించారు పాండవులు.

ఇది పాండవుల ధర్మాచరణ.

**(6)** దుర్యోధనుడు పరుల రాజ్యాన్ని హరించాలనే దుర్బుద్ధి కలవాడేనా?

**జ:** రాజ్యంపై చట్టబద్ధమైన, ధర్మబద్ధమైన హక్కు పాండవులదేనని ఇంతకుముందే నిరూపించటమైనది. ఆ పాండవ రాజ్యాన్ని హరించాలని ఎన్నో ఎత్తులు ఎత్తి, అనేక అకార్యాలు చేసినవాడు దుర్యోధనుడు. దానికి సహాయులుగా నిలిచినవారు కర్ణ, శకుని, దుశ్శాసనులు. వారిని ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ప్రోత్సహించినవాడు అంధరాజు ధృతరాష్ట్రుడు. కనుక దుర్యోధనుడు పరులరాజ్యాన్ని హరించాలనే దుర్బుద్ధి కలవాడే. సందేహం లేదు.

ఇదే విషయాన్ని కౌటిల్యుడు (చాణక్యుడు) తన అర్థశాస్త్రంలో 'ఇంద్రియజయం' అనే అధ్యాయంలో కామక్రోధ లోభమోహ మదమాత్సర్యాలనే అరిషడ్వర్గాల వల్ల బంధుమిత్ర సపరివార సమేతంగా నాశనమైన ఇతిహాస ముఖ్యుల గురించి ఇలా తెలియజేశాడు.

**శ్లో॥ మానాత్ రావణః పరదారా నప్రచ్ఛయన్।**
**దుర్యోధనో రాజ్యాత్ అంశంచ సబంధురాష్ట్రో వినాశః॥**

**తా॥** పరస్త్రీని అపహరించి రావణుడు, పరరాజ్యాన్ని హరించి దుర్యోధనుడు–బంధుమిత్ర సపరివారసమేతంగా నాశనమైపోయారు–అని.

దీనినిబట్టి కూడా దుర్యోధనాదులు దుర్మార్గులని, పాండవులు ధర్మాత్ములని సందేహాతీతంగా ఋజువౌతున్నది.

– ఈ విషయాన్నింతటితో ముగిద్దాం

ఇక మహాభారతంలోని ద్రౌపదీదేవి యొక్క అసాధారణ వ్యక్తిత్వాన్ని నాశనం చేయుటకు కంకణం కట్టుకొని; ద్రౌపదీదేవి పాత్రను నీచాతినీచంగా చిత్రిస్తూ 'ద్రౌపది' నవలను వ్రాసిన అనేకులు చేసిన వ్యక్తిత్వహననానికి సమాధానంగా ఇక ద్రౌపదీదేవి యొక్క స్వభావాన్ని, సౌశీల్యతను, పాతివ్రత్యాన్ని, గొప్పతనాన్ని, శత్రువులు కూడా ప్రశంసించే ఆమె వ్యక్తిత్వాన్ని తెలుసుకుందాం! **(వచ్చే సంచికలో)**

0883 - 246 2565
903 246 2565

MOHAN PUBLICATIONS

మోహన్ పబ్లికేషన్స్,

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మి - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

